1

హాలక్ష్మీ మూవీస్ వారి



# భీమాంజనేయ యుద్ధం

ర్శకత్వం: ఎస్.డి.లాల్ • నిర్వహణ: దోనేపూడి కృష్ణమూర్తి • నిర్మాత: టి.రామకోటేశ్వరరా

# కథా సంగ్రహం

త్రేతాయుగంలో ఆంజనేయుడూ, ద్వాపరయుగంలో భీముడూ వాయునందనులు. ఆంజనేయుడు చిరంజీవి; శ్రీరామభక్తుడు. భీముడు వీర సింహుడు; మహాబలవంతుడు. ఆ వీరాధివీరులు భీకరసంగ్రామం చేశారంటే ప్రపంచంలో ప్రళయం దాపురించదూ? ఆ పరిణామానికి కారణకారణాలే యీ కథా విధానాలు. నారదుడు కలహ భోక్త అంటారుగాని, ఆ మహర్షి కల్పనలన్నీ మానవకల్యాణానికి మంగళహారతులు. ఆంజనేయుడు పాండవ పక్షాన ప్రసన్నుడు కావాలనే తాపత్రయంతో నారదుడు పన్నిన సూత్రాలు పాత్రలకు ప్రాణాంతకమైతే తుదకు కృష్ణ పరమాత్మ దర్శనమిచ్చి శాంతి దీవిస్తాడు.

కథకంతకు మూల సూత్రాలు సౌగంధికా పుష్పాలు. అరుణోదయ వేళకే అగుపించే ఆ పుష్పాలతోనే రోజూ కుబేర చక్రవర్తి శివపూజ చేస్తారు. నలకూబరుడు కుబేరుని కుమారుడు; యువరాజు.

నలకూబరుని పొందగల నాట్యరాణి తానేనని గర్వపడిన రంభా - సౌందర్యమణి సౌదామిని - ఇద్దరిని పోటీనాట్యానికి సన్నద్ధపరిచాడు నారదుడు. విజయం పొందిన సౌదామినిని, సౌగంధికాలు సమర్పించే పనిలో నియమించాడు చక్రవర్తి. రంభకు నలకూబరుడంటే ఎంతో అనురాగం. కాని నలకూబరునకు సౌదామినంటే ప్రేమ; ప్రాణం. ఆ ప్రేమకు లగ్నబంధంగా సౌగంధికా పుష్పం ఆమె తలలోపెట్టి ప్రమాణం చేశాడు యువరాజు. శివపూజకు తక్కువ అయిన ఆ పుష్పం ఆమె తలలోచూచి ఆగ్రహపడి చక్రవర్తి సౌదామినికి రాజ్య బహిష్కారం విధించాడు. సౌదామినినే మనసా వాచా ఆశించిన నలకూబరుడు రంభ అంటే అనాదరణ చూపుతాడు. అందుకు రంభ వచ్చి సౌదామినిని గంగలోతోసి పగతీర్చుకుంటుంది. ఆమె ప్రణయ సౌగంధికాపుష్పం ప్రవాహంలో పోయి ద్రౌపదికి

దొరుకుతుంది. అలాంటి పుష్పాలు తెమ్మని ద్రౌపది భీముణ్ణి బలవంతం చేయగా ఘటోత్కచుని సాయం ఉంచి పుష్పాల కోసం భీముడు బయలు దేరుతాడు.

కష్టాలుపడి సౌదామిని ఆంజనేయుని చెంతకు రాగా నారదుని బోధతో ఆమెకు ఆశ్రయమిచ్చాడు పావని. భీముడు ఎలాగో గంధర్వ లోకం చేరి యక్షులను జయించి సౌగంధికాలతో భూలోకంలోకి దూకాడు. తాను సాధించిన ఘన విజయానికి భీముడు గర్వపడగా నారదు డాతనిని ఆశ్రమం చేరే విధం చేస్తాడు. ప్రణయ సౌగంధికం సౌదామిని చేతికి అందుతుంది. దానిని గురించి భీముడు – సౌదామిని ఘర్షణపడేసరికి అతడు సౌగంధికాలు అపహరించిన ద్రోహి అని ఆంజనేయుడు తన వాలంతో భీముణ్ణి బంధించి, పూజా పుష్పాలను కుబేరున కిచ్చిరమ్మని సౌదా మినిని పంపుతాడు. కాని అక్కడ ఆమెయే దొంగ అని ఆరోపించి కురూ పిగా శపిస్తాడు కుబేరుడు.

తండ్రి జాడకై ఘటోత్కచుడు బయలుదేరి ఆంజనేయుని ఎదు ర్కొంటారు. శక్తికిమించగానే యుక్తిచే విడిపిస్తాడు. కాని నిజం గ్రహించ గానే భక్తాంజనేయుడు ప్రకోపిస్తాడు. భీముడు వీరావేశుడౌతాడు.

భయంకర యుద్ధం ! భీమాంజనేయుల భీషణ సంగ్రామం ! ఆ ప్రళయం ఎలా నివారణ అయింది? సౌదామినీ నలకూబరులు ఏక మయ్యారా ? శ్రీకృష్ణుని బోధతో ఈ గాథ ఎలా శాంతి సాధించిందీ తెరపై చూడండి.

# పాటలు

రంభ : రచన : నారాయణరెడ్డి

పాడినది : L. R. ఈశ్వరి

పలికేరాగం కులికేభావం నేనేలే
నింగిలోన నేలపైన నేనేలే ॥

ఇంద్రుడు పులకించే అందెలు నావి
చంద్రుడు తలవంచే అందాలు నావి
నవ నవలాడే పరువము నాది
దివిలో భువిలో నాసరియేరీ ॥ పలి ॥

తారలు నన్నుగని తళతళలాడేను
గాలులు నన్నుగని గలగలసాగేను
మెరుపులమించే తలపులు నావి
దివిలో భువిలో నాసరియేరీ ॥ పలి ॥

రంభ : రచన : ఆరుద్ర

సౌదామిని : పాడినది : సుశీల, ఈశ్వరి

నేనె నేనె మధుగీతి
నవరసపూరిత విలాసవతి ॥
మదిలో పొంగే మాధురి నేనే
సుధలో కలిగే సుఖమును నేనే
కలువల రాయుని వెలుగులు నేనే
కలలో దొరికే ఫలమును నేనే ॥ నేనే ॥

చవులూరించే చెలువము నాదే
నవలోకముల నవ్వులు నావే
పరవశమొందే పరువము నాదే
వలపూ గెలుపూ సకలము నేనే ॥ నేనే ॥

కుబేర :

రచన : తాండ్ర

పాడినది : వెంకట్రావు

కాళీచిత్త సరోజ బంభర హరా!
గంగా శశాంకప్రియా!
క్ష్వేళాభీల వినీలమంగళగళా!
క్షమం కరా! శంకరా!
కాలవ్యాళకపాల భూషణధరా!
కారుణ్య రత్నాకరా!
ఫాలాక్షా! నటరాజతాండవ శివా
భక్తావనా! పాహిమాం॥

నలకూబర :

రచన : నారాయణరెడ్డి

పాడినది : ఘంటసాల

సురభామినీ! సౌదామినీ!
కలహంస వోలె యిటురావే
తెలినవ్వు వెన్నెలలు తేవే ॥ సు ॥

సెలయేరులలో జలధారలలో
నీ కులుకులేవో కనిపించె
చిగురాకులలో పువురేకులలో
నీ సొగసులేవో తోచే
ఏమందు నేను నాముందు నేడు
నవనందనాలు నిలిచె ॥ సు ॥

నే తుమ్మెదనై మధురమ్ముగ, నీ
గానమ్ము చేతు జవరాలా
నే తెమ్మెరనై లలితమ్ముగ
నీ నయనమ్ము లంటెదనుబాలా
యేనాటికైన నీబాటలోన
పయనింతులెమ్ము చెలియా ॥ సు

రచన : నారాయణరెడ్డి
పాడినది : ఘంటసాల, సుశీల

నలకూబర : సిగలోన విరిసిన సౌగంధికా
చెలికింత తొందరయేలా

సౌదామిని : సిగలోన విరిసిన సౌగంధికా
చెలి జాగుచేయుట మేలా -

నలకూబర : పసిడి కిరణములు మెరిసేవేళ
మిసిమి కోరికలు ఎగిసేవేళ
మదిలో మరులేవో కదిలే యీ వేళ
మౌనమైన కరువాయెనా ! ॥ సిగ ॥

సౌదామిని : తనువు కోవెలగ వెలసినవేళ
ప్రణయ వేదములు పలికేవేళ
మదిలో నాస్వామి కొలువైన వేళ
మాటలు యింకేలనో -

ఇద్దరు : సిగలోన విరిసిన సౌగంధికా
చెలిమికి నీవే నవదీపికా

ఆంజనేయ :

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

రామా ! రఘుకులసోమా
శ్రీరామా ! జయరామా
నీల నీరద కోమలశ్యామా ॥ శ్రీరామా ॥

సాధు సంస్తూయ సాకేతధామా
శాంతి సంధాన జగదభిరామా
తారక శుభనామ కళ్యాణరామా ॥ శ్రీ ॥

మైథిలీ మధుర మందార చామర
సమాందోళనా

మణికంకణ మంజులమూర్తీ
రామచంద్రమూర్తీ -
దాశరధీ ఘనకారుణ్య జలధీ
దానవ సంహార ధర్మవిచారా
సకలగుణసాంద్ర శ్రీరామచంద్రా ॥ శ్రీ ॥

**ఆంజనేయ :**

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

జపమేమి చేసెనో జనకమహారాజు
కల్యాణరాముని కాళ్ళుగడుగ
నోమేమి చేసెనో భామామణీ సీత
రామమూర్తికి తలంబ్రాలుపోయ
క్రతువేమి సల్పిరో కౌసల్య దశరధుల్
లాలించి రఘురాము జోలపాడ
పూర్వపుణ్యంబేమి పొంగెనో భూప్రజల్
సాకేతరాము దర్శనముజేయ
ఏ తపస్సు ఫలించి వాల్మీకి మౌని
భక్తిరామాయణము వ్రాసి ముక్తిజెందె
ధరణి పుణ్యాత్ములెందరో దాటిపోవ
స్వామికిన్ దూరమైతి నా పాపమేమొ ॥

**ఆంజనేయ :**

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

రామ నామ సుధా మధురాతి మధుర
పావనాక్షర సేవ జీవనమటంచు
సంతతము జేయు రఘురామస్మరణ మొకటె
మానవాళికి తారకమంత్ర మబల ॥

శ్రీరామ

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

అనుజన్ముండవటంచు సంతతము నా
కానంద సంధాతయా
అనుగున్ నెచ్చెలివంచు లోదలచి ఆ
ప్యాయంబుగా జూచితిన్
అనుకోనైతి ఒకప్పుడేని యిటు నీ
ప్రాణాలకీ రాముడే
జనియించెన్ ధరమృత్యుదేవతని నా
స్వప్నంబులోనైన ల
క్ష్మణ! ఈ అగ్నిపరీక్ష నా హృది క
లంపన్ అంపపున్ కోతయా ||

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

అవశిష్టంబులు దీర్చి, సర్వము పరి
త్యాగంబు గావించి, బాం
ధవ మిత్రాళి సమేతుడై నడచి ని
ద్రాహారముల్ మాని, రేల్
పవలుం జేసె ప్రయాణ మయ్యది మహా
ప్రస్థాన మా యాత్రలో
అవతారంబు ముగించి రాముడరిగన్
వైకుంఠ దేవుండుగా ||

భీముడు :

రచన : తాండ్ర
పాడినది : మాధవపెద్ది

అనుపమ వీరసింహుడని
ఆ యుగమందు ప్రసిద్ధియేమొ; కా

రణ మరయంగ భీముడు ధ
రాస్థలి పుట్టగలేదు; ఒక్క వీ
రునిగని దేవుడో యనుచు
మ్రొక్కెడు మూర్ఖ జనావళి; ఆంజనే
యుని ఘనకార్యమంతయును
కోతుల భాగవతంబుగాదొకో ॥

ఆంజనేయ :
సౌదామిని :

రచన : రాజశ్రీ
పాడినది : ఘంటసాల, సరోజిని

జయ జయ జానకిరామా
రఘుకులసోమా పావననామా ॥ జయ ॥

ఖలులను ద్రుంచి సుజనుల కావగ
ధరణిని వెలసిన దశరథరామా
శివుని ధనస్సును భంగముచేసి
సీతను గైకొన్న కళ్యాణరామా ॥ జయ ॥

అల విభీషణుని అభయముకోర
ఆదరించి కరుణించిన రామా
దశకంధరుని రణమున దునిమి
లోకశాంతి నెలకొల్పిన రామా ॥ జయ ॥

తారకనామా - దనుజ విరామా
మేఘశ్యామా - శ్రీరామా !
భూసుతకామా - సద్గుణధామా
పాహి పాహి - పట్టాభిరామా ॥ జయ ॥

మాయా సౌదామిని : రచన : నారాయణరెడ్డి

పాడినది : L. R. ఈశ్వరి

ఎటు ఎటు ఓ రాజా ఎటు
ఇటు ఇటు రారాదా ఇటు
నీదే నీదే ఈరేయి నీదే ‖ ఎటు ‖

నా కన్నులలో కైపురేపు చిన్నెలున్నవి !
నా వన్నెలలో వాడని సంపెంగలున్నవి !
నాసరి యెవ్వరురా నేనే నేనే నేనే ‖ ఎటు ‖

నేనెన్నడు యీ రీతిగ పులికించలేదులే
నిన్నెన్నడు యీ రీతిగ తిలకించలేదులే
నీ అనురాగమింక నాదే నాదే నాదే

మణిమంత : రచన : రాజశ్రీ

పాడినది : శ్రీరామ్ P

వీరుడనే ధీరుడనే
వినవే ఓ భామా !
ఔనన్నా కాదన్నా తప్పదు మన ప్రేమ ‖

కండబలం చూపిస్తా
ముల్లోకాలను వణికిస్తా -
రూపంలో మురిపిస్తా
మన్మథుడనె వోడించేస్తా
నీతో నేడు సరి యనిపిస్తా - రంభా ‖

కోటి కలలు కన్నానే
నీ మనసే నాదనుకున్నానే
ఔనని అంటే స్వర్గం
కాదంటే బ్రతుకే నరకం
నీవే నీవే నాకిక సర్వం - రంభా !

భీముడు :

రచన : తాండ్ర

పాడినది : మాధవపెద్ది

ప్రాంచిత కీర్తిశాలియగు
పాండు నృపాలుడు నాదు తండ్రియా
సంచిత ధర్మనందను డ
జాతరిపుండు మదగ్రజుండు; పే
ర్గాంచిన వీర విక్రము క
శాగ్రణి అర్జు డన్గుతమ్ముడై
మించెడు భీమసేనుడను
మేర యెరుంగవె వానరాధమా ॥

ఆంజనేయ :

రచన : తాండ్ర

పాడినది : ఘంటసాల

ఆలము సేయ బూని నిట
లాక్షుడె నన్నెదిరించుగాక, నా
వాలము, మృత్యుదేవి కర
వాలము; రాక్షస వంశమారణా
భీలము, వైరివీరజిత
భీకర యుద్ధ జయాలవాల మీ
వాలమె, ఓ దురాత్మ! నిను
బంధితు జేయును కాలపాశమై ॥

సౌదామిని :

రచన : నారాయణరెడ్డి

పాడినది : సుశీల

కలలన్ని ఫలియించె యీనాడే
నాకలలన్ని ఫలియించె యీనాడే
తలపులు చిగురించె యీనాడే
కలువను జాబిలి కలిసెను నేడే

పరిమళలహరులు విరిసెను నేడే
మనసే మధువై తొణికెను నేడే ||కల||

పరిణయ రాగము పలికెను నేడే
అలకానగరము కలకలలాడే
వలపే వరమై నిలిచెను నేడే ||కల||

రచన : తాండ్ర
పాడినది : మాధవపెద్ది.

కాలదోషంబు పట్టిన ఘనతతోడ
బ్రతుకు చుంటివి నీవు ప్రపంచమందు
రామ భజనమ్ము చేసెడు ప్రతిభకన్న
అవసరంబైతి వేమి రామాయణమున
వీరుడీవైన పోరాడు భీముతోడ.

ఆంజనేయ :

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల.

కలన జయింప లేక బలగర్వ
మడంగియు చింత జచ్చినన్
పులుసది చావలేదనెడు పోలిక
దుష్టదురాగ్రహంబునన్
పలికెదు; ఫాలలోచనుడె
బాసటగా నిను గావనెంచినన్
పలువ; మదీయ ఘాత
యమవాటికి పంపెద మానవాధమా!

రచన :
తాండ్ర

పాడినది :
ఘంటసాల

ఆంజనేయ : ధరణి శ్రీరామ చంద్రుడే దైవమేని
సీత భూజాత యీ లోకమాతయేని

భీముడు : ధర్మనందనుడే సత్యధర్ముడేని
జగతి పాంచాలియే మహా సాధ్వియేని

ఆంజనేయ : దోషమెరుగని రామభక్తుండ నేని

భీముడు : కృష్ణపరమాత్మ మమ్ము రక్షించు నేని

ఆంజనేయ : కదన విజయమ్ము మారుతే గాంచుగాక

భీముడు : కదన విజయమ్ము భీముడే గాంచుగాక.

కృష్ణ :

రచన : తాండ్ర
పాడినది : ఘంటసాల

పండెన్ దుష్ట చతుష్టయంబునకు పా
పం బాపదల్ బాయు బ్ర

హ్మాండంబంతకు కౌరవాధముల రా
జ్యంబేమి? లోకంబులే

గాండీవంబునకున్ నమోన్నమయానం
గా తద్రథాగ్రమ్మునన్

జెండాపై కపిరాజు నిల్చె విజయ
శ్రీ లిచ్చి దీవింపగా॥

# సాంకేతిక నిపుణులు

కథ, కవిత :- తాండ్ర సుబ్రహ్మణ్యాం
సంగీతం :- T. V. రాజు
పాటలు :- నారాయణరెడ్డి, తాండ్ర, రాజశ్రీ, ఆరుద్ర
ఛాయ :- రామచంద్ర
శబ్దగ్రహణం :- M. D. వాల్కే, A. A. స్వామి
స్టిల్సు :- పి. యస్. మూర్తి
కళ :- కుదరవల్లి
కూర్పు :- జి. డి. జోషి, బి. ఎస్. మణి
నృత్యదర్శకులు :- చిన్ని-సంపత్
దుస్తులు :- నారాయణరావు
సెట్టింగ్స్ :- పెరుమాళ్ళరాజు
మేకప్ :- వీర్రాజు, రాజగోపాల్

అసోసియేట్ డైరెక్టరు :- ధనకోటేశ్వరరావు

## సహాయకులు

దర్శకత్వం :- D. బాబూరావు
సంగీతం :- విజయా క్రిష్ణమూర్తి
ఛాయ :- గోపీనాథ్
శబ్దం :- మూసా-రాజన్
మేకప్ :- శ్రీనివాస్-మన్మధరావు.
దుస్తులు :- రాజు, తంగవేలు, మహాలక్ష్మి
ప్రొడక్షన్ :- అప్పారావు-రంగస్వామి

# తారాగణం

| | |
|---|---|
| రాజశ్రీ | దండమూడి రాజగోపాలరావు |
| విజయశ్రీ | కామినేని ఈశ్వరరావు |
| S. వరలక్ష్మి | కాంతారావు |
| వీణావతి | రమణారెడ్డి |
| | చలం |
| | సత్యనారాయణ |
| | ముక్కామల |
| మరియు | హరనాథ్. |

స్టుడియో :
ఫిలిం సెంటర్

---

నైజాం జిల్లాలకు డిస్ట్రిబ్యూటర్లు :

**మ్యూజికల్ ఫిలిమ్స్**

**రాష్ట్రపతిరోడ్ : సికింద్రాబాద్.**